# మారుతి

కృతికర్త:

మోచర్ల రామకృష్ణయ్య, బి. ఏ.,
నెల్లూరు.

1931.



[వెల రు. ౦-౪-౦

మ. కవితాత త్త్వవిదుఁడు, పద్యరచనాకౌశల్య మెవ్వాఁడు శా
కవలీలన్ లభియింపఁజేసె, నెవఁ డధ్యాత్మాదివిద్యారహ
స్య విశేషజ్ఞుఁడు, శిష్యవత్సలు నెదన్ ధ్యానింతు మద్భాగ్యయా
ర్జవచింతామణి, ధీమణిన్ సుగుణి, సుబ్రహ్మణ్య విద్వన్మణిన్.

ఉ. నా కవితావినూత్నలత నాఁటికి నాఁటికి వర్ధమానల
క్ష్మీకలితాత్మయై, సకలసీమల నల్లి, దిగంతపంక్తికిన్
బ్రాఁకి, యశస్సుమంబుల సువాసనలన్ వెదచల్లునట్లు నా
నీరజురాణి, వాణి, శుభలీలఁ గృపాసుధఁ జిల్కుఁ గావుతన్.

# మారుతి

శ్రీయుత రామనామ జప
శీల! విఖండితపాపజాల! రా
మాయణ మాలికా కనద
నర్ఘమనోజ్ఞమహఃస్వరూప! యా
మ్నాయకళాభిరూప! సుమ
నస్స్తుతిపాత్ర యశఃకలాప! భ
ద్రాయితరూప! నిర్దళిత
దాసమనఃపరితాప! మారుతీ!

౨

ఉ. ధారణి, వీరపూజ శుభ
దంబని ప్రాజ్ఞజనుల్ వచింపఁగా
సారపరాక్రమాతిశయ
సంపదఁ బొంపిరి పోవు నీమహో
దారచరిత్ర పద్యసము
దాయమునన్ వెలయింపఁబూనితిన్
గూరిమి మంజులోక్తు లొడఁ
గూర్పుము నాకుఁ గృపాబ్ధి! మారుతీ!

౩

చ. అనవరతంబుఁ దావక మ
హాద్భుత పుణ్య కథావిశేషముల్
విని, హరిదంతవిశ్రుత న
వీనభవద్రమణీయకీర్తి వ
ర్ణన మొనరించి, నాదు జన
నంబును ధన్య మొనర్ప నెంచితిన్
దనువున దార్ఢ్యమున్, మనము
నన్ స్థిరవృత్తియుఁ గూర్చు మారుతీ!

౪

ఉ. వాయుతనూభవాయ, పరి
పాలితభక్తజనాయ, ధూర్తదై
తేయవిమర్దనాయ, విత
థీకృతశాత్రవవిక్రమాయ, వీ
రాయ, విలంఘితోన్నత త
రంగభయంకరవార్ధయే, నమ
స్తే! యని భక్తి తత్పరమ
తిన్ వినుతింతును నిన్ను మారుతీ!

౫

మ. లలితోద్యన్మణికుండలోజ్జ్వలకపో
లా! చారుసౌదామనీ
తులితాకార! సుపాటలానన! దృఢా
స్తోకస్ఫురద్వక్ష! మాం

నలదోర్దండ! పిశంగనేత్ర! పటుశ
శ్వద్దీర్ఘలాంగూల! మం
జులకా_ర్తస్వరహా_స్తకంకణ! జగత్
స్తుత్యాకృతీ! మారుతీ!

౬

మ. హరుసం బుప్పతిలంగ, వాగ్ఘటము ధీ
యంత్రాన సంధించి, పెం
పరుదారన్ రసవ ల్లసత్కవన కు
ల్యాశ్రేణి, నంచద్భవ
చ్చరితాంభోధి సముద్ధృతామృతము ని
చ్చల్ నించి, మత్స్వాంతభా
స్వర కేదారమునందు భక్తివరి నేఁ
బండించెదన్ మారుతీ!

౭

చ. కలుషపు టాజవంజవము
గట్టిగ నమ్మి, తదీయదుఃఖసం
కలిత విపత్తులన్ మునిఁగి
కక్కసమున్ సహియించి, యాయువున్
బలితపు టైహికార్థముల
పాలొనరించు జనాళికెల్ల నీ
విలస దుదాత్తజీవితము
విస్ఫుట నీతిదమయ్య, మారుతీ!

ఉ. పీడలఁ బాఱఁదోలఁగల
వీరశిఖామణి వీవు; సంపదల్
గూడఁగఁ జేయఁజాలిన స
ఖుండవు నీవు; మహా ర్తిఁ బాపఁగా
వేఁడెడు దీనమానవుల
భీతి నిమేషమునన్ హరించు పెన్
బ్రోడవు నీవు; భ క్తజన
పోషణ! నీకెవ రీడు మారుతీ!

౯

శా. "క ర్తవ్యం మహదాశ్రయ" మ్మనెడి వి
ఖ్యాతో క్తి నాలించి, భ
క్తా ర్తిధ్వంసపరాయణుండ వని నీ
యంఘ్రిద్వయిన్ జేరితిన్
ధూ ర్తంబైన విధిప్రతారణములన్
దూలింపవే! విస్ఫుర
త్కీ ర్తిన్ నాకు ఘటింపవే! శుభములన్
గీలింపవే! మారుతీ!

౧౦

చ. నిను సుకుమారుఁ గాఁబడసి
నిస్తుల శ స్త యశస్సుఁ గాంచె నం
జన, రిపు లోకభంజన! తు
షారగిరీంద్రకుమారి కందునిన్

గని ఘనకీ ర్తిఁ గాంచినప్ర
కారముగా;దొలిపుట్టు వందు త్వ
జ్జనని యొనర్చినట్టి సుకృ
తం బది యెట్టిదో చూడ మారుతీ!

౧౧

ఉ. బాలుఁడవై, విభావసు న
భమ్మునఁ గాంచి, తదంశుతీక్ష్ణ రు
క్చాళికి భీతిఁజెందక జ
వ మ్మెసఁగన్ గబళింపఁబోవె? నీ
లీలలు చిత్రముల్ గద, ని
లింపరిపు క్రధనప్రచండ! లాం
గూలచలత్కరాళమణి
కుండల! ఖండనచండ! మారుతీ!

౧౨

మ. అతిభక్తిన్ బతిసేవలన్ సలుపు ఛా
యాదేవి మూర్ఛిల్లఁ, గం
పితగాత్రంబులతో, విదూరగతులై,
భీతిచ్ఛిదామంత్ర సం
తతి వల్లించెడు వాలఖిల్యమును ల
త్యంతంబు తొట్రిల్ల ను
ద్ధతి భానున్ గబళింపఁబోయితట, మా
న్యస్థితీ! మారుతీ!

౧౩

ఉ. చండగభస్తిపైఁ గవిసె
సాహసికత్వ మెలర్ప దోర్బలో
ద్దండుఁడు-గర్వి-యీతని మ
దం బణఁగింతు మటంచు మౌని మా
ర్తాండులు శాప మిచ్చుటను
స్వాత్మబలంబు నెఱుంగ వీవు-లే
కుండిన నిన్ను గెల్వఁగల
యోధుఁ డొకండు గలండె? మారుతీ!

౧౪

ఉ. భానునిసేవసల్పి, సుల
భంబుగ శాస్త్రము లెల్ల నేర్చి, వి
జ్ఞానధనంబుఁ జేర్చి, సుర
సంస్తుతిఁ గంటివి బాల్యమందె—తే
జోనిధులైనవారలు వ
సుంధరఁ, బ్రాయమునందుఁ బిన్నవా
రైనను మాన్యు లౌదురు గ
దా మతిసంపదఁ జేసి మారుతీ!

౧౫

ఉ. శ్రాంతి యెఱుంగనేరని, చ
రగ్రహమై, గణియంగరాని భా
స్వంతు సుపాంతమంద తొలి
పల్కుల నధ్యయనం బొనర్ప వి

క్రాంతిఁ ద్రివిక్రమాకృతిని,
బ్రాక్చరమాద్రులపైఁ బదద్వయిన్
వింతగ నిల్పి కాంచితి వ
భీప్సితసిద్ధిని నీవు మారుతీ!

౧౬

చ. అనుజుఁ డహంకృతిన్ విరహి
తాఖిలరాజ్యునిఁజేయ ఋశ్యమూ
క నగమునన్ భయాకులతఁ
గ్రాఁగి కుమారిలు చండభాను నం
దనునకు మంత్రివై యతని
తాపమడంగఁగఁ జేయలేదె? నీ
యెనయిక కల్గువారి యెడ
లేల తొలంగకయుండు? మారుతీ!

౧౭

ఉ. పావనశీలరై, భువన
పంచ్యవిభూతిఁ దనర్చు నంజనా
దేవికిఁ బూర్వపుణ్యాభర
దివ్యఫలంబవౌ నా జనించి, సు
గ్రీవుని మంత్రివై, యతని
కిన్ గడుఁగూర్చు సఖుండవై, దశ
గ్రీవుని నిగ్రహించితి, వ
రిందమ! మందరధీర! మారుతీ!

౧౮

మ. అతికామాంధ్య వినష్టదృష్టియయి, శు
ద్ధాంతంబునన్ దారతో
రతులన్ దేలుచు నున్న యర్కసుతుఁ జే
రంజీరి, క_ర్తవ్యమున్
హితమున్ దెల్పి, విదేహరా_ట్తనయ న
న్వేషింపఁగాఁజేయు నీ
మతిసాచివ్యము సన్నుతింతు నయసం
పద్భారతీ! మారుతీ!

౧౯

మ. చకితాదిత్యముగా, మహేంద్రశిఖర
స్థానంబు నందుండి, మిం
టికి లంఘింపఁగ నీవు, ప్రోత్థితములై
నిర్యచ్ఛిలాభూరుహ
ప్రకరంబుల్ వినువాక దాఁక నిసుఁ జే
రం బంపి, తోఁతెంచె ను
ర్వికిఁ; జుట్టంబును బంపి వేమరలు వా
రిన్ బోలుచున్ మారుతీ!

౨౦

ఉ. అంబరమార్గవ_ర్తి వయి,
యమ్మకరాలయ మప్డు నీవు శీ
ఘ్రంబుగ దాఁటుచోఁ, బ్రణయ
కల్పిత కోపభరంబు నూని మా

నంబున నున్న వేల్పు చెల
నాఁగలు నిన్నని తత్తరిల్లి, వే
గంబునఁ డాఁగలేదె తమ
కాంతులకౌఁగిళులందుః? మ్మారుతీ!

౨౧

ఉ. వేలుపుబాలకుల్ విడిచి
పెట్టిన గాలిపటంబుపోల్కి, ను
ద్వేల నితాంత సత్వరగ
తిన్ సురవర్త్మమునందుఁ బోవు నీ
లీలకు బెగ్గడిల్లి కడ
లిన్ మకరాదిజలేచరాళి పా
తాళబిలాంతరస్థలిని
డాఁగఁగ నేగె నటంద్రు మారుతీ!

౨౨

శా. విద్యుత్కాంతుల నీను దేహలతతో
విన్వీథి నీవేగుచో
ఖద్యోతుండు పునఃపరిగ్రహణ శం
కన్ మబ్బునన్ డాఁగఁ దే
పద్యన్ పీడి? సమిద్విహారనిపుణ
ప్రస్ఫీతదోస్సారగ
ర్వోద్యద్దానవ దుర్దశాపిశున వా
లోల్కద్ధతీ! మారుతీ!

౧౩

శా. ఛాయాగ్రాహిణి సంహరించి, సురసన్
సాధించి, వీరోచిత
వ్యాయామంబునఁ జండమూర్తివయి, దు
ర్వారోద్ధతిన్ దుష్టదై
తేయాళిన్ భవదీయశౌర్యకలనా
దీప్తాశ్రయాశచ్ఛటా
భూయిష్ఠప్రభకున్ రణోర్వి శలభం
బుల్ సేయవే మారుతీ!

౧౪

మ. మతియున్, ధైర్యము, దృష్టియున్, మఱియు సా
మర్థ్యంబు నీయందు సం
తతమున్ వర్ధిలుఁ గాన, నీవు తలఁపన్
దథ్యంబు సర్వార్థ సం
తతి సిద్ధించు నటంచు గౌరవమునన్
శ్లాఘింపరే నిన్ను దే
వత లెల్లన్ మును నీవు సింహికను జం
పన్ గాంచి యోమారుతీ!

౧౫

శా. లంకాత్రాణపరాయణవ్రత సము
ల్లాస స్ఫురన్మానసన్
లంకాశక్తి నుదగ్రదోర్బలకళా
లంకారకేళీ నిరా

తంకస్ఫూ ర్తిని ముష్టిఘాతములచే
తఱ ప్రుంచఁగాఁ జేసి, ని
శ్శంకఁ దుర్ఘట రామకార్యభరముఁ
సాధింపవే! మారుతీ!

౨౮

ఉ. ఆయతసత్త్వ నిర్భర ర
యమ్ము లెసంగఁ బయోధి దాఁటి, నీ
వాయవనీజకుఁ రఘువ
రాన్వయభూషణు నంగులీయకం
బీయకయున్న సీత గతి
యేమయియుండునో? పుణ్యమైన రా
మాయణగాథ యేకరణి
మార్పడి యుండునో యేమొ మారుతీ!

౨౯

మ. 'తరమే నీకు ననుఁ రఘూద్వహుని చెం
తఁ జేర్పఁగా సూక్ష్మవా
నరమూర్తీ!' యని సీత సంశయపడఁ
దత్ప్రత్యయార్థంబు మం
దరసంకాశమహావపుః పరిణతిఁ
దర్పించి, వైశ్వానర
స్ఫురణఁ వెల్గిననాఁటి నీగరిమముఁ
భూషించెదఁ మారుతీ!

౨౮

మ. ఒక వై దేహిసె కాదు—పర్వతవన
వ్యూహ ప్రయుక్తంబుగా
సకలాట్టాలక తోరణోన్నత మహా
సౌధాద్యుపేతంబుగా
సుకర ప్రక్రియ లంకనే కొని రఘు
క్షోణీశుసాన్నిధ్యమం
దొకటన్ జేర్పఁగఁజాలు నేర్పరివి నీ
సుద్యద్ద్యుతీ! మారుతీ!

౨౯

మ. శ్రుతి మాధుర్య వచస్సమేతము, ద్విజ
స్తోమంబుఁ బోఁదోలుచున్
రతమున్ జేయుచు శాఖికోత్కర, మన
స్సార్గప్రకారంబులన్
గతి సారించుచుఁ, ద్రుంపవా కొ్క సుమనః
కాండంబు మున్నీవు ప్రో
ద్ధతభంగిన్ దశకంఠు లీలను దదు
ద్యానంబునన్ మారుతీ!

౩౦

శా. నీవాలమ్మునఁ జిచ్చుపెట్టి, దితిజా
నీకంబు బాధింప, భ
క్త్యావేశమ్మున, రామభద్రుని మదిన్
ధ్యానించి, ధైర్యోన్నతి

శ్రీవిభ్రాజితమూర్తివై, భయద బ
హ్విశ్శ్మష్టురుల్ సర్వాలం
కావస్త్ర్యంబులు చేసి తాహుతులుగా
నర్కద్యుతీ! మారుతీ!

౩౧

మ. సరసీజాకరముల్ మదావళము సో
త్సాహంబుగాఁ జొచ్చి, సుం
దర సౌగంధిక ముఖ్య పుష్పచయముల్
ధ్వంసించు చందానఁ బు
ష్కరవీథీ పరిచుంబి సంజవన సం
స్ఫ్యాయోపకార్యా సము
త్కర శోభాకర లంక సల్పితివి భ
గ్నం బౌనటుల్ మారుతీ!

౩౨

శా. శ్రీమ ద్రాక్షస సార్వభౌమ పురి భ
స్మీభూతముల్ జేసి, ని
స్సీమోత్సేక బలాతి రేక జయల
క్ష్మీసంపదల్ వెల్గు నీ
స్థేమంబుల్ గనినట్టివా "రసురులన్
శిక్షింప శ్రీవిష్ణువే
నీమాన్యాకృతిఁ దాల్చివచ్చె" నని సం
దేహింపరే మారుతీ!

౩౩

మ. 'కుచకాఠిన్యము పాదపంకజములన్
గూర్పం డదేలా మితం
పచుఁ డాఘూతుకుఁ' డంచుఁ దిట్టి రట బ్ర
ష్టా ర్ద్రై త్యముగ్ధాంగనా
నిచయం బీవు దశాస్య పట్టణము ని
ర్ణిద్రోద్ధతిన్ గాల్చుచోఁ
బ్రచల ద్వాల విలోల చండహుతభు
గ్జ్వాలాతతీ! మారుతీ!

౩౪

ఉ. చండిమగండవై, శరధి
దాఁటినశక్తియు, సాంపరాయికో
ద్దండుఁడవై దశాస్యసుతుఁ
దాఁకి వధించిన విక్రమక్రియా
ఖండవిలాసమున్ గనిన
గండరగండఁడ వంచుఁదోఁచు, నా
ఖండలు చేతివజ్రమును
గాదు సమానము నీకు మారుతీ!

౩౫

మ. విలస ద్విశ్రుత ధైర్యభాను రుచిమై
విఘ్నాంధకారంబు లు
త్కలికన్ జీల్చి, యవక్ర విక్రమమునన్
గ్రవ్యాశి రాట్పట్టణం

చెలమిఁ గాల్చి, నిలింపు లంబరమునన్
హృష్టాత్ములై దీవనల్
సలుపన్ దెల్పవె సీతవృత్తము రఘు
త్మాభర్తకున్ మారుతీ!

౩౮

ఉ. స్వామిహితార్థ మీవు వన
వాటుల నెన్నిటినో క్రమించి, యు
ద్దామగతిన్ మహార్ణవము
దాఁటి, నిశాటుల మీటి, జానకీ
క్షేమ మెఱింగి రా నిఖల
కీశగణంబులు నిన్ నుతింప 'శ్రీ
రాము ప్రభావమే యిది తి
రం' బని పల్కితి వౌర! మారుతీ!

౩౯

చ. పొలయక, జానకీహృదయ
శోకతమిస్రము రూపుమాపఁ గే
వల ముపకారబుద్ధిఁ గపి
భావముఁ గాంచిన భాస్కరుండ వు
జ్జ్వలగుణపూర్ణ! నీ పవని
జాసతికిన్ రఘురాము సేమమున్
దెలుపకయున్న యెట్టి నిర్ఘృ
తిన్ గనియుండునో సీత మారుతీ!

౩౮

చ. వననిధి లీలదాఁటి, యన
వద్యగుణాన్విత సీత శోక వ
హ్నిని హరియించి నీవు దహి
యించితి రావణలంక దాననే,
యనఘ! లభించె రెండుపర
మార్థము లొక్కట నీకుఁ; గర్మ శీ
లున కిటులేకదా పొసఁగు
లోకమునన్ ఫలసిద్ధి - మారుతీ!

౩౯

చ. కడిమి గలట్టిబంటునకుఁ
గల్గునె చేయఁగరాని చెయ్ది? యే
యిడుమకు నైన నోర్చి తన
యేలిక యిచ్చు యదెట్టి దైనఁ జొ
ప్పడఁ గలభంగి నాతఁ డెటొ
వాఁడిమి సూపి యొనర్చు; నీవు నీ
యొడయనిపంపు నేఁతకయి
యోర్వవె బన్నము లెన్నొ మారుతీ!

౪౦

శా. వీరాశంసన మందుఁ గోణపచమూ
విధ్వంస పారీణతన్
ఘోరాకారుఁడవై, నిరంకుశసదా
కుంఠీభవ ద్విక్రమ

శ్రీరాజిల్లఁగ యుద్ధమాడితివి సు
గ్రీవుండు మెచ్చంగ నా
రా! రామాయణ మాలికామణివి వీ
రగ్రామణీ! మారుతీ!

౪౧

మ. వెరవారంగ, భవద్రణోల్బణ రస
క్ష్వేడా మహాడంబర
స్ఫురణన్ మూర్ఛ మునింగి, రక్కసుల గుం
పుల్ బిట్టు వాపోవుచున్
బొరివోవన్ విహరించినాఁడవు, కరం
బున్ బ్రోఁడవై రాఘవే
శ్వరపాల స్త్వభయంకరాహవమునన్
సంరంభితన్ మారుతీ!

౪౨

శా. కింకన్ దానవకోటి డీకొని, దిశల్
గీడ్పాటు నొందన్ నిరా
తంక ప్రజ్ఞ రణం బొనర్చునెడ నీ
స్థైర్యంబు, ధైర్యంబు, నీ
బింకంబున్, గరిమంబు, కౌశలము, గాం
భీర్యంబు శౌర్యంబు, వ
జ్రాంక శ్లాఘ్య విలాసమున్ గనిన నా
రా! చోద్యమౌ మారుతీ!

౪౩

ఉ. అంచిత ధైర్య సార విభ
వార్ణవ! దుర్ణయశీలురైన న
క్తంచర వీరులన్ దునిమి,
తద్రుధిరాన వసంతమాడి, క్రీ
డించిన నీయుదగ్రత, క
డింది మగంటిమి యద్భుతంబు; ని
ర్వంచిత మైన నీబలము
వర్ణనసేయఁ దరంబె మారుతీ!

౪౪

ఉ. ఆహతలకు ణుండవు-మ
హాబల విక్రమ భాసురక్రియా
సాహస వర్తనుండవు-ద్వి
షద్ద్వీప కుంభ విదారణోగ్ర వి
ద్యాహారిమూర్తి, వార్త జన
తావన సంతత లబ్ధకీర్తి వ
వ్యాహత వీరధర్మ నియ
మాభ్యుదయుండవు నీవు మారుతీ!.

౪౫

ఉ. ఉరుతర రోదసీ కుహర
మొక్కటఁ ముంపఁగజాలు విశ్వ భీ
కరలయకాల సాగరము
కంటెను నూర్మడుఁగుల్ గభీరతా

గరిమను మేటి వీవు; నిను
గన్న పవిత్ర సతీమతల్లి కుం
జరసుత ప్రాగ్భవంబునను
సల్పిన పున్నెము లెన్నొ మారుతీ!

౪౬

ఉ. రూక్ష శిఖాసహస్ర ఘన
రోచుల లోకములెల్లఁ గాల్పు క
ల్పక్షయ వహ్ని కంటెను బ
లారె! పరాక్రమశాలి వీవు నీ
యక్షయశౌర్యరేఖ కెదు
రై నిలువంగలరే రణక్షితిన్
యక్ష మనుష్య రాక్షస ఖ
గామరు లొక్కటిమైన మారుతీ!

౪౭

మ. ప్రళయంబుద్భవిలన్ జరాచరపటు
బ్రహ్మాండ భాండంబు బ్ర
ద్దలుచేయన్ జనియించు భైరవుని రౌ
ద్రస్ఫూర్తి యేపాటి? శ
త్రుల నుద్వృత్తిగ లోకభీకరగతిన్
ధ్వంసింప నుప్పొంగు నీ
విలస ద్వీరరసస్వరూపము రణో
ర్విన్ గాంచినన్ మారుతీ!

౪౮

చ. అనిఁ గపిసేనపైఁ గవిసి
యబ్బురమైన యభిక్రమంపుఁ బెం
పున విహరించి, బిట్టు వెలి
పుర్ వెలయించుచు విక్రమించు న
ద్దనుజుని సాంయుగీను బల
దర్పిత దుర్మదచిత్తు ఖడ్గరో
ముని జముప్రోలికంపవె ప్ర
భూతపరాక్రమధామ! మారుతీ!

౪౯

మ. బలవత్క్రూరదశాననప్రహరణ
వ్యాపార సంప్రాప్తక
శ్మలుఁడై సంగరభూమిఁ గూలినఘనున్
సౌమిత్రి సమ్యగ్గుణో
జ్జ్వలునిన్ దేర్పఁగ, జీవనౌషధములన్
సాధింప నెవ్వానికిన్
దలమా? ధారుణి నీకుఁగాక భువన
స్తవ్యాకృతీ! మారుతీ!

౫౦

ఉ. క్షీరపయోధిఁ జిల్క సర
సీరుహనాభుఁడు మందరాద్రి యే
తీరున నెత్తె, నీవు నటు
దివ్యపద స్పృశ దగ్రకూట వి

స్ఫారవిశాల మేరునగ
సామ్యము, ద్రోణముఁ బన్నగేశ్వరా
కార సుదీర్ఘవాలమునఁ
గట్టి పెకల్చితివయ్య మారుతీ!

౫౧

మ. అల శాండిల్య మునీంద్ర శాపమున
గ్రాహాకారముఁ దాల్చి, మ
త్తిలి, నీ రేచ్ఛనువచ్చు వేఁ మెకములఁ
దీండ్రించి, భక్షించుచుఁ
మలినీ భూతమనస్కుఁడై, సరసి ని
ర్మాహాత్మ్యయై యున్న వి
హ్వాల రక్షింపవె ధాన్యమాలినిని శా
పం బూడ్చి యోమారుతీ!

౫౨

ఉ. విరహితశాపయై తగు త్రి
విష్టపకాంత మహోపదేశ వి
స్ఫురణ నిజంబు నీవెఱిఁగి
ముష్కరునిఁ గుహనాయతీంద్రు నిం
ద్రరిపుని గాలనేమి గురు
దక్షిణకుఁ గుఱిసేయఁగా సము
ద్ధురముగ గృద్ధి స్వఃపురికిఁ
దోడనె పంపవె నీవు మారుతీ!

౫౩

ఉ. ఉదయ నగమ్మునన్ దపనుఁ
డుద్భవ మొందక మున్నె యోషధుల్
వెదకి, లభింపఁజేసికొని,
వేగమె తెచ్చి, యొసంగి, లక్ష్మణున్
బ్రదుకఁగఁ జేయనోపు దని
రావణుఁ డే ద్దెఱ నెన్నొ విఘ్నముల్
పొదువఁగఁజేసెఁగాని, రవి
ముం దిరులయ్యెనవెల్ల మారుతీ!

౫౪

ఉ. మాయలమారులౌ చెనఁటి
మానిసిదిండుల తోడఁ బోరి, శో
భాయతమూర్తివై, దశర
థాత్మజునిన్ విలసన్మహాజయ
శ్రీయుతుఁ జేసినట్టి నినుఁ
జేరి యనారతమున్ భజించినన్
శ్రేయము లెన్నియేనియును
జేకుఱకుండునటయ్య? మారుతీ!

౫౫

చ. అసదృశమైన తావక స
హాయత సుస్థిర యానపాత్రమై
యొసఁగ రఘూద్వహుండును మ
హీసుతయున్ దరియించి రుగ్రదు

ర్వ్యసనమహార్ణవంబు; నిను
వంటిమహాత్ముఁడు చెంతనుండఁగాఁ
బొసఁగక యుండునే శుభ వి
భూతి విశంకటరీతి మారుతీ!

౫౮

మ. పరిపంథిన్ దెగటార్చి, పత్ని చెఱఁదీ
ర్పన్ దీక్షఁ గైకొన్న భా
స్కరవంశాగ్రణి యొక్కఁ, డన్నవలనన్
సర్వంబుఁ గోల్పోయి వం
దురు భానూద్భవుఁ డొక్కఁ, డిర్వురును దో
డ్తో సిద్ధసంకల్పులై
పరితోషించుట యెల్ల నీ చెలిమి సం
పత్తిన్ గదా మారుతీ!

౫౯

శా. నీ వొక్కండవె చాలవే దశముఖున్
నిర్జించి, తత్కంఠముల్
లావున్ జేవ యెలర్పఁ ద్రుంచి యవలీ
లన్ తేని కర్పింప; నీ
ప్రావీణ్యంబు నెఱింగి యేల రఘువీ
రస్వామి తా నట్లు క్లే
శావేశంబును బొందె పంక్తిముఖ సం
హారార్థమై మారుతీ!

౫౮

మ. నియమాధీన నవీనభ క్తికలనా
నిర్ఛిద్ర రుద్రార్చనా
ప్రియుఁడై యొప్పెడి పంక్తికంధరునితో
ద్వేషంబు పాటింపఁగా
నయమా! న్యాయమ నీకు; నేకపద రు
ద్రాంశ ప్రభూతత్వ వి
వ్యయశః పూర్ణుఁడ వీవు కావె? దివిష
ద్భాగ్యాకృతీ! మారుతీ!

౫౯

చ. విజయుని తేరి టెక్కెమున
వేడుక నిల్చి రణాంగణస్థలిన్
గుజనులఁ గౌరవేయులను
గూల్పఁగఁ జేసి సురేంద్రసూతికిన్
విజయనమున్ ఘటించిన ప
విత్రచరిత్రుఁడ వీ వటంచు నీ
భజన మొనర్తునయ్య! పరి
పాలిత భక్తకదంబ! మారుతీ!

౬౦

మ. వనవాసమ్మునఁ గృష్ణ వేఁడ కుసుమ
ప్రాప్త్యర్థమై పోవు పా
వనియధ్వమ్మున నడ్డమున్న నిను లే
వన్ బూని, యాత్మీయదో

ర్జనితానంతబలమ్ము నొడ్డియును నీ
షన్మాత్రముఁ దాఁ గద
ల్పను నోపం డటె తావకోద్భట మహా
వాలాగ్రముఁ మారుతీ!

౬౧

ఉ. కీర్తితబాహుసత్త్వ మశ
కీకృతరాక్షస! భానుదీప్తి మ
న్మూర్తి! మరుత్సమస్యద! మ
నోజవ! ప్రాంచితకాంచనాద్రి వి
స్ఫూర్తి మదుజ్జ్వలాకృతి! వి
శుద్ధయశస్వి! సమాశ్రితార్తి సం
హర్త! యరిష్టతాతి! నిను
నాత్మఁ దలంతు సతంబు మారుతీ!

౬౨

మ. బలవద్వైరివిభంజనా! సుజన జీ
వంజీవ జైవాతృకా!
విలస ద్రాఘవ పాదవారిరుహ మా
ధ్వీపానలోలా! మహో
జ్జ్వలతేజోవిభవ ప్రభావ సుభగా!
భక్తప్రియంభావుకా!
కలితోత్కృష్టమతీ! మహోన్నతధృతీ!
కమ్రాకృతీ! మారుతీ!

౬౩

శా. ధీరా! కర్బురవంశనాశనకరా!
దీప్తప్రతాపాకరా!
వీరా! రాఘవకార్యతత్పర! జగ
ద్విఖ్యాతధైర్యోద్ధురా!
కారుణ్యామృతసాగరా! విజితవో
ద్గర్వప్రచండాసురా!
శూరా! సంగరభంజిత ప్రతిభట
స్తోమోన్నతీ! మారుతీ!

౬౪

ఉ. ఆర్తజనవ్యళీకహరణా!
సుగుణాభరణా! మదోల్లస
ద్వర్తనదైత్యధర్షణ! సు
పర్ణ సముద్ర విణ ప్రయోగని
ర్వర్తిత రామదౌత్య పరి
వర్ధిత సర్వసుపర్వతోషణా!
ధూర్త వలాహకవ్రజవి
ధూతి సమీరణ! ధీర! మారుతీ!

౬౫

మ. జితకాశీ! ఘనపుణ్యరాశి! స్వజవా
త్సేకక్రియా గోష్పదీ
కృతవారాశి! యఖండసాగరజయ
శ్రీనిత్యసాంగత్య ని

ర్జిత దుర్జ్ఞేయపలాశి! మోక్షవరల
క్ష్మీ సత్కృపా చంద్రికా
మృతధారా పరిషిక్తహృత్కువలయ
స్మేరద్యుతీ! మారుతీ!

౬౯

శా. వ్యాఘాతం బొనరింపఁగాఁ గలఁడె యె
వ్వాండైన యుష్మజ్జయా
మోఘానల్పసముద్యమంబుల; కిరుల్
పోఁ జూపఁగా నోపునే
మేఘద్వారమణిప్రభాపటలి? గం
భీరద్విషన్మండల
శ్లాఘాలంఘన జాంఘికోజ్జ్వల యశ
స్సంపత్కృతీ! మారుతీ!

౭౦

ఉ. దీప్తమతీ! హిమాచల ధృ
తీ! వరివస్యితగోపతీ! సరో
జాప్తసమద్యుతీ! యధిగ
తార్యనుతీ! విదితాఖిలశ్రుతీ!
ప్రాప్తమహోన్నతీ! చటుల
భగ్నదశాస్యవనీవనస్పతీ!
గుప్తసుహృత్తతీ! విబుధ
కోటిగతీ! శివతాతి! మారుతీ!

౬౮

మ. ధరణీపుత్త్రియె సోమిదమ్మ-రఘునా
థస్వామియే యజ్వ-భా
సురమా లంకయె యజ్ఞవాటిక-సద
స్యుల్ ఋక్షుద్రై తేయ వా
నరసంఘంబులుగా, దశాస్య పశుబం
ధక్రీడ కా త్రివ్యజ్యముఁ
బరఁగన్ నీ వొనరించినాఁడవుగదా
భాస్వన్మతీ మారుతీ!

౬౯

శా. ఓ శాఖామృగ శేఖరా! జగములం
దున్నారలే వేద వి
ద్యాశౌండీర్యము నందు నిన్ దొనయు సం
ఖ్యావంతు లయ్యారె! నీ
వైశారద్యము గీష్పతి ద్రుహిణ కా
వ్య వ్యాళరాణ్ముఖ్య ధీ
కౌశల్యంబును జీరికిన్ గొనునె వి
ఖ్యాతాయతీ! మారుతీ!

౭౦

మ. అవగీర్ణంబు భవన్మహామహిమ; ప్ర
వ్యక్తంబు నీశక్తి; సం
స్తవనీయంబు త్వదీయచిత్రచరితో
జ్జ్వల్యంబు; త్రైలోక్యగా

రవపాత్రంబు ప్రశస్తయుష్మదతుల
భ్రాజ ద్యశస్స్ఫూర్తి-గా
నవినోదీ! సురవైరిభేదీ! రిపుమా
నచ్ఛేదీ! యోమారుతీ!

౨౧

ఉ. పాప మహాటవీ తతుల
భస్మముచేయ వలంతివై, జగ
ద్వ్యాపకశక్తి యీశ్వరుని
యంశమవై, శ్రితవత్సలుండవై,
ప్రాపితభక్తకామిత ని
రంతర దానవినోదివై, సుసం
తాపిత వైరివై, త్రిభువ
న స్తవనీయుఁడ వైతి, మారుతీ!

౨౨

ఉ. నీకడగంటిచూపు రజ
నీచరకోటికి హృద్విదారకం
బై కనుపట్టు; నాశ్రిత జ
నాళికి మంగళమూలకంద మై
శ్రీకరమై తనర్చు; నను
శీఘ్రమ త్వత్కరుణాకటాక్ష ల
క్ష్మీకలితాత్ముఁ జేయుమని
చేతులు మోడ్చెద నీకు మారుతీ!

౨౩

చ. అరయఁగఁ బుణ్యశీలు రగు
నట్టి మహాత్ముల పాదసేవచే
దురితములెల్లఁ దూలు రవి
దోఁచిన ప్రీలు తమంబు లట్ల, యు
ర్వర, సువివేకవంతులకుఁ
బ్రాప్యముగల్గునె యింతకన్న; త
త్పరిణతికై త్వదీయకృప
వాంఛ యొనర్చితి నయ్య మారుతీ!

౨౪

ను. హనుమంతుండు సమర్థుఁ డీజగతిలో
నాపన్నులన్ బ్రోవఁగా
ననుచున్ విన్నకతమ్మునన్ దొడఁగితిన్
బ్రార్థింపఁగా నిన్ను; నీ
యనుకంపామృతవృష్టి మామకమనో
వ్యాసక్త తాపత్రయా
గ్నిని జల్లార్పక నీకు తప్ప దిక, సం
దీప్తాకృతీ! మారుతీ!

౨౫

మ. శరణము వేడువారలకు
సాయము సేయక వీడు టొప్పునే?
నిరుపమధర్మధుర్య! తగు
నే శ్రితపాలిని ద్రోసిపుచ్చఁగా

పరమతు లైన యార్యజన
వర్యులు దీనుల వేడుకోల్ నిరా
కరణము చేయఁగంటిమె జ
గమ్మున నెచ్చటనైన మారుతీ!

## ౭౬

చ. జనకసుతావి యోగమున
చండమనోవ్యథ కారణంబుగా
దినదినముక్ గృశించు జగ
తీపతి రామునికిక్ వసుంధరా
తనయ శుభస్థితిక్ దెలిపి
తాపముఁ దీఱిచినట్లు నీవు నా
మనమున నున్న దైన్యమును
మాపి ధృతిక్ దయసేయు మారుతీ!

## ౭౭

శా. భూత ప్రేత పిశాచ సంతతుల ని
ర్ధూలింపగా జాలి, సం
ప్రీతిక్ సాధులఁ బ్రోవఁగల్గి, కుజన
శ్రేణీ వినాశ క్రియా
ఖ్యాతిం గాంచినవాడ వీవు, భవదీ
యాలంబముక్ నమ్మి, ని
ర్భీతిక్ జింతల ద్రోతు, దీనభరణ
క్రీడారతీ! మారుతీ?

౭౮

మ. నిరతంబుల్ వినుతింపఁ బాత్రముగదా
సీ బ్రహ్మచర్యంబు; సు
స్థిర యుష్మన్మహసీయధైర్యము మహా
చిత్రంబుగాదా! ధరా
ధర లోహాశని కల్పతాపకమనో
దార్ఢ్యంబు స్తోత్రార్హమై
ధరభాసిల్లుఁగదా! శ్రితార్తిహరణో
ద్యత్పాండితీ! మారుతీ!

౭౯

ఉ. ఇంద్రియనిగ్రహం బనఁగ
నేమొ యెఱుంగనివారలు తమ
స్వాంతులు, దూష్యవర్తనులు,
చంచలచిత్తులు, గానకీన ని
స్తంద్ర జితేంద్రియత్వ మను
దారత మూలగా గ్రహింప, స
ర్వేంద్రియదుష్ప్రవృత్తిని జ
యింపరె? జ్ఞానులు గారె? మారుతీ!

౮౦

ఉ. ప్లవగవరేణ్య! సీభుజ బ
లం బొకలంకిణియే యెఱుంగు; నీ
జవ మొకవాయువే యెఱుఁగు;
సాధ్వి ధరిత్రిసుతాలలామయే

భవదురునై జరూప విభ
వంబు నెఱుంగు; త్వదీయ సత్కృపా
ప్రవిమలసిద్ధి లభ్యమగు
వైఖరి నా కెఱిగింపు మారుతీ!

౮౧

మ. భువి, నూర్జస్వలు లైన వారిచరితం
బుల్ సంస్మరింపంగ, మా
నవుఁ డుత్సాహసమగ్రుఁడై వఱలు మం
దప్రజ్ఞుఁడైనన్; ద్వదీ
యవిచిత్ర ప్రకట ప్రవర్తనముల
ధ్యానంబునన్ నిల్పు భ
క్తవతంసుల్ నిరుఁబోలి వెల్గరె యలం
కర్మిణులై? మారుతీ!

౮౨

శా. నామీఁదన్ దయయుంచి రాఘవునితో
నావృత్తముల్ దెల్పి యో
స్వామీ! నీప్రభువైన యాతనికి నా
పైఁ గొంత వాత్సల్యముల్
బ్రేమంబుల్ ఘటియిల్లఁ జేయుము, శుభా
విర్భావసందర్భని
స్సీమప్రాభవ శోభితుండనయి వా
సిన్ గాంచెదన్ మారుతీ!

౹౩

శా. 'దాసోహ' మ్మని నీపదద్వయము చెం
తన్ వ్రాలితిన్ భక్తర
క్షా సామర్థ్యము నీకుఁదక్క కలదే
సర్వప్రపంచంబులన్
నీసౌహార్దము నాయెడన్ నిలిపి మ
న్నింపన్ దగున్ నన్ను; నా
దోసమ్ముల్ క్షమియించి, యక్కటికఁ
దోడ్తోఁ బ్రోవుమీ! మారుతీ!

౹౪

శా. నీవే ప్రాపని నమ్మి, నీపదములన్
సేవింతు; యుష్మత్కృపా
ప్రావీణ్యంబున నామకాఘములఁ బా
రందోలఁ గాంక్షింతు; సం
భావింపందగు నీదుపుణ్యకథలన్
బల్మారు నాలింతు; ర
క్షోవిధ్వంసక! యార్తరక్షక! పరా
క్షోభ్యాకృతీ! మారుతీ!

౹౫

ఉ. వానరవీర! నీదగు ప్ర
భావము నేమని యుగ్గడింతు, నీ
మానితగాథ నెవ్వఁడు స
మంచితభక్తిరతిన్ బఠించునో

యానరుపాపపుంజముల
నంతములైనను భస్మమౌను, లం
కానిలయాళి నీవలనఁ
గాలినచందము నొంది మారుతీ!

౮౯

ఉ. తీరని యైహిక వ్యవహా
తిఁ జరియించుచు నున్నవాని, న
న్నో రఘురామభక్త! కరు
ణోదధివై పరమార్థమార్గ సం
చారసమర్థుఁ జేసి యని
శంబును నీవలె పుణ్యమూర్తులౌ
వారికి సేవ సేయఁగల
భాగ్యము భోగ్య మొసఁగు మారుతీ!

౯౦

మ. విమలోదాత్తగుణోత్తరుండవు, జగ
ద్వీరుండ వుద్దామ దు
ర్దమ బాహాబల నిర్జితారివి, సము
ద్దండ ప్రభావుండ వీ
వు మహాత్మా! భవదీయనిష్కలుష వి
స్ఫూర్జల్లసద్దివ్యరూ
పము చూపట్టఁగఁ జేసి నన్ మనుపవే
భద్రాకృతీ! మారుతీ!

౮౮

శా. ఔదార్యార్జవసుప్రశస్తుఁడవు; బ్ర
హ్మాజ్ఞాన సంపన్నతా
మోద ప్రాభవ చిత్తవృత్తివి; శమ
స్ఫూర్తి ప్రభూపాస్తి మ
ర్యాదావేదివి; విక్రమక్రమ నిదా
నానేక సత్కార్యదీ
క్షాదక్షుండవు నీవు; లోకహితసం
కల్పవ్రతీ! మారుతీ!

౮౯

మ. గరిమన్ గానకళారహస్యపదవీ
జ్ఞానైక వారాశివై
పరమార్థస్థితి నారదాదిముని సం
భావ్యానుభావ స్ఫుర
ద్భరతం బొండు రచించి, యాంధపళిరు
క్తార్థార్కమై వెల్గు సు
స్థిరకీర్తిన్ గడియించినాఁడవు ధరి
త్రీమండలిన్ మారుతీ!

౯౦

మ. నినుబోల్ లోకహితైకలోలమతులన్
వీక్షింతుమే విశ్వమం?
దెన యెవ్వారలు నీకు ధార్మికత? నీ
బృందిష్ఠ చారిత్రమున్

వినినంతన్ సకలామనస్యములుఁ బో
వే పంచబంగాళమై?
ఘనగాంభీర్య గుణాభిరామ! వినమ
న్నాకద్రుమా! మారుతీ!

౯౧

శా. సాక్షాన్ముక్తిరమాపురంధ్రి యగునా
త్మోపుత్త్రి బోధింపఁగా
మోక్షోపాయరహస్యసూత్రముల స
ద్బుద్ధిన్ వివేకించి, నీ
యక్షీణాపచితప్రభావమున బ్ర
హ్మాంబున్ దదీయస్వరూ
పాక్షయ్యస్థితియున్ గ్రహించిత నిమే
షార్ధంబునన్ మారుతీ!

౯౨

ఉ. భోగ్యములైన సర్వసుఖ
ముల్ త్యజియించి, పరోపకారిత
యోగ్యత వెల్వరించిన మ
హోత్తమమూర్తివి: రాజయోగసౌ
భాగ్యసుఖానుభూతి యల
వడ్డ తపస్వులకున్ ద్వదీయ వై
రాగ్యమహత్త్వసిద్ధి సుక
రంబుగఁ జొప్పడునయ్య? మారుతీ!

౬౩

చ. చలనవిహీన దేహగతిఁ
జక్కఁ జెలంగ సమాధి నిల్చి, ని
ర్మల పరిపూర్ణ నిర్గుణ ప
రస్థితియం దమనస్కయోగివై
తలపున కందరాని పర
తత్త్వము చిన్మయ శుద్ధ బుద్ధ ని
స్తుల విమలస్వరూపమును
జూడఁగఁ గల్గితి వీవు మారుతీ!

౬౪

చ. పతన నిదాన మైన పశు
పాశములన్ విదళించి, మానసో
ద్ధతి నరికట్టి, శాంతిఁ గొని
తత్త్వవిదగ్రణివై దురంత సం
సృతి వనరాశి మగ్నతఁ గృ
శించు పృథగ్జనకోటికిన్ సము
న్నత రఘురామనామ జప
నౌకను జూపితి వీవు మారుతీ.

౬౫

మ. మునులున్, యోగిజనుల్, తపోనిరతులై
మోక్షేచ్ఛ నెవ్వాని ద
ర్శనభాగ్యమ్మునకై తపించియును గాం
చన్ జాలరో, యట్టి యా

వనమాలిన్, జగదీశ్వరేశ్వరుని వి
శ్వవ్యాప్తు, వైకుంఠు రా
ముని, సేవింపఁగ నోచి తీవు; త్రిజగత్
పూతాకృతీ! మారుతీ!

౯౬

చ. మూదమున బారిజాత తరు
మూలమునన్ నివసించి భక్తి భా
స్వదమల రామనామ జప
సార సుధా రసధార లానుచున్
హృదయ సరోజ మధ్యగత
నిర్మల శర్మద చారు చిత్కళా
భ్యుదయముఁ గాంచుచున్ వెలయు
యోగిని నిన్నుఁ దలంతు మారుతీ!

౯౭

చ. ఎటనెట రామకీర్తనమ
హీనగతిన్ జెలువారుచుండునో
యట నట మస్తకస్థల కృ
తాంజలివైఁ కనుదమ్ములన్ సము
త్కటముగ బాష్పవారి యొలు
కన్ వినుచుండెదవంట-యట్టి నీ
పటుతర రామభక్తిని గృ
పన్ దయసేయుము నాకు మారుతీ!

౯౮

మ. అనిదంపూర్వ మహానుభావత, భవి
ష్య ద్బ్రహ్మావై భూతకో
ట్లను సృష్టించెదవంట నీవు ఘనల
లాచాతురిఁ భ క్తచం
దన! నా కీవొకయు త్తమంబయిన జ
న్మంబుఁ బ్రసాదించి న
న్ననఘుఁ గా నొనరింప వేడెద మహీ
యఃప్రీతిమై మారుతీ!

౯౯

శా. నీ కల్యాణగుణ ప్రభావమును వ
ర్ణింపంగ బ్రహ్మాదినా
కౌకస్సంతతి చాలదన్న; తరమే
యగ్గింపఁగా నాకు? నే
మో కావించితనయ్య! యీలఘుకృతిఁ
బూనిక్రఁ యథాశ క్తి; సు
శ్లోకా! నీ కివి యిత్తుఁ జంద్రునిగ నూ
ల్పోగుఁ బలెఁ మారుతీ!

౧౦౦

శా. భారద్వాజ పవిత్ర గోత్రుఁడు, శుభా
ప స్తంబసూత్రుండు, సు
శ్రీరాజద్గుణ రామలింగ బుధ ల
క్ష్మీనారసింహాంబికా

సారప్రేమఫలంబు, త్వచ్చరణ పూ
జాసక్తుఁ డర్పించె వి
స్ఫారప్రీతిని, నిల్పు మీకృతిని గ
ల్పస్థాయిగా మారుతీ!



చిత్తారాధిత వాగ్వధూచరణ రాజీవుండు మోచర్ల వం
శోత్తంసుం డగు రామకృష్ణకవి భక్త్యున్నిద్ర సంవి త్ప్రసం
పత్తిస్ఫూర్తి రచించి, వెల్వఱిచె నీపద్యోచ్చయంబుం బ్రజో
త్పత్తి జ్యేష్ఠ వలక్ష పక్ష గత సప్తమ్యర్కవారంబునన్.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1931.

ఈపొత్తంబును వలయువారు ఈ క్రింది చిరునామకువ్రాసినఁ బడయఁ

గలరు.

మోచర్ల రామకృష్ణయ్య, బి. ఏ.,

ప్లీడరు, నెల్లూరు.

లేక

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, మద్రాసు.